జై హిం ద్

# నాజీ నైజాం

---

రచన:

" సంగీతసారధి "

బుద్ధిరాజు శ్రీరామమూర్తి

విక్టరి ప్రెస్, విజయవాడ.

1948

వెల 0-8-0

# అంకితము

చ. మతములవన్ని యేకమగు మార్గమునే జనియించెనంచు నే
మ్మతి నొకబోధజేసెను సమత్వము నెవ్వడు దేవదూతయై
సతతము నామదిన్ విడని సద్గురుడైన మహాత్మ సాయికిన్
అతులితభక్తి బీదనయి అంకితమిత్తు సుహృత్సమాశిగా.

# కృతజ్ఞత



నా కావ్యాన్ని ఆంధ్రసహృదయమండలికి అందించడానికి
సర్వవిధాలా సహాయంచేసిన నా ప్రియమిత్రులు
శ్రీ కనుమూరు సాంబయ్యగారికి

స్మరహరు గొల్చువాడవును సాయిని భక్తిని దల్చువాడవున్
మురహరు కీర్తనంబుమది ముచ్చటగా స్మరియించువాడవున్
సరసమెరుంగు వాడవును సచ్చరితాకము కనుమూరు సాంబయా
నిరతము ధర్మబుద్ధివగు నీకగు శ్రీలును ఆయువుల్ సదా.

కవి వరులన్న ప్రేమయును గౌరవభావముగానమందునన్
నవయుగ ధర్మపద్ధతుల నాచరణంబున పట్టువిడ్పులున్
ప్రవిమల జ్ఞానమున్ కలుగు బ్రాహ్మణులందున భక్తిశ్రద్ధలున్
భువిని జనించి నంతటనె పుట్టినబుద్ధులు నీకు సాంబయా.

మాటలసందడిన్ నుడువు మాటను గైకొనినాదు పొత్తమా
పాటున ముద్రచేయుటకు మాటనుయిచ్చి తదాది నుండి బా
హాటమునైన బుద్ధిని సహాయము చేసిననిన్ను సర్వదా
చాటును సత్ప్రవర్తన యశస్సుల ఈశ్వరుడెల్ల కాలమున్.

# అ భి నం ద న

సీ. నాగురుదేవులౌ నాదెళ్ల వంశంబు
పురుషోత్తముండునౌ పుణ్యమూర్తి
తనయుడైనట్టి మేధా దక్షిణామూర్తి
పరమపూజ్యులు వారిప్రస్తుతింతు
గారాబు తనయుగా గాంచిన తలిదండ్రు
లనఘమూర్తులు వారినభి నుతింతు
పితృతుల్యుండైన పెద్దన్న శ్రీరాము
పెద్దగాజేసి నే ప్రియముజూతు

గీ. ఆత్మజులకంటె నెక్కుడు నాదరించి
నన్ను ఒక యింటివానిగా తెన్నుజూపి
నట్టి నా ఆప్తమిత్రుండు ఆత్మబంధు
వలని బాన్పొడి ప్రకాశుతలతు సతము.

---

# వి జ్ఞ ప్తి

కావ్యాళిచదివి అభ్యసించిన కవిత్వముగాదు, నేనుకూడ కవిత్వము వ్రాయుదమను ఉత్సాహమే ఈ కావ్యరచనకు నన్ను పురికొల్పినది సులభశైలికావచ్చును ప్రస్తుతము కావలసిన దిదియే యని మిత్రుల ప్రోత్సాహము సాహిత్యమెట్లున్నను, సంగీత మునకు తల యూపురసజ్ఞులవలె పాఠక మహాశయులు యిందలి దోషములు మన్నించి వర్జించ ప్రార్థన.

రచయిత:

జై హింద్

# నాజీ సైజాం

---

హిందూరాజుల నైకమత్యమును మా హిందూలదౌర్బల్యమున్
హిందూశాస్త్రము ధర్మపద్ధతులనున్ హిందూ లహింసారతిన్
హిందూదేశపు వైభవోన్నతులకున్ యెంతో కనుల్ గుట్టియున్
యెందెందో పరఖండవాసు లిటకున్ యిచ్ఛాగతిన్ జేరియున్

రంగుల నీసురత్నములు రవ్వలపంటకు స్థావరంబు మా
బంగరు భారతావనిని పాదొనరించియు తర్లిపోవుచున్
భంగములేవి సోదరులమధ్య మతంబను దుర్విషంబునున్
సంగరరంగమౌనటుల చల్లిన యా తెలవారి మాయలే

అని తలపోయలేక మనమందున, ముస్లిములీగు పార్టినిన్
తనదు ప్రయోజకత్వముగ స్థాపనజేసెను జిన్నసాయె బా
పనువున పాకిస్థానమని భాగముపంచుకు నాటినుండియున్
అనుజులునైన హిందువుల ఆపదల న్నొనరించు హింసలో

ఉ. నీవును పాలుగొంచు కడునీచుడునౌ రజివీప్రగల్భమున్
లావుగలట్టి సంస్థయని లాయిఖుఆలియు ప్రోత్సహింపగా
చేవగలట్టివాడనని చిందులుత్రొక్కి సవాళ్లుచేయుచున్
నీ వనదుర్గమంతటను నింపితివా యుధసైన్యబల్గమున్

చ. మతమనుకత్తిచేతగొని మహ్మదు నాశనకర్తయయ్యెగా
మతమను వ్యాధితోడుతనె మారణమయ్యెనునాడు దేశమున్
మతమను పిచ్చిపీడుమని మాదుమహాత్ముడు బోధజేసినన్
మతమను రంధియే రజివిమంత్రములై విషమింపజేసెగా

మ. గృహకల్లోలమటంచు నెల్లరును యీ, కించి ద్వేశేషంబునున్
సహనంబౌ మదితోడ చూచుకొనుడీ, సంఘర్షణల్లేక మా
సహకారంబులు లేవటంచు యనరే, జంకింతయున్లేని నీ
యహితంబౌ కుహనాదిబుద్ధులకు మా కత్యంత సంతాపముల్

ఉ. ఓయి నవాబ మాదునుడినొక్కటియున్ గమనింపవైతి నీ
స్థాయికి భంగపాటు లిటు సంభవమౌనని యెంచవైతివే
హాయినిమేయు జీవితమునార్తిని పొందగ జేసికొంటి వీ
చే యెప్పుడైన క్రిందనుచు చిత్తమునన్ తలపోయుమా ప్రభూ

. భారతదేశమందున యపారమునౌ ధనసంచయంబులున్
క్షీరమునున్ గలట్టిదని పెద్దగనెంచిరి నీదురాజ్యమున్
గౌరవమున్ వహించెదవు గాంచెదుగొప్పను యూనియన్నులో
జేరుమటంచు వేవిధులచెప్పిన వింటివ? తోడివారలున్

. సామముతో వంచిచితిమి చాలగకాలము వ్యర్థమాయెగా
కామితమేమి లేదుగద కాంచనదానమునున్ గ్రహింపగన్
స్వామి తురుష్కనాయకుడు చక్కగనాటిన భేదభావ మం
దేమియు మార్పులేదుగద యెంచగ దండనమొక్కటేతుదిన్

నెయ్యముగోరి మేము కృతనిశ్చయ చిత్తముతోడనుండగా
కయ్యముగోరిజేసితివి కర్మముతప్పదుగాదె యేరికిన్
వియ్యము జేసికొందమని వేయివిధంబుల చెప్పియుంటిమే
దయ్యమువోలె రజ్వి నిను తందనపాటలు పాడజేసెగా

శాంతినిగూర్ప ఇండియను సైన్యదళంబు సికిందరాబాదులో
నుంతుమటంచు మంచిగను ఓర్పుగచెప్పిన మాదుమాటలా
లింతువటంచు ఆగితిమి యింతయు నీచెవినాటదాయెగా
యింతకు దాపురించుటకు యెంతవిచారము నందుచుంటివో

చ. కరకుకసాయి రజ్వి నుడికారములున్ మరి మీపధానియౌ
పరమకిరాతకుండు కడుపాతకుడున్న గు లాయిఖాలియున్
గరపిన పాఠముల్ మదికి కమ్మగనుండెనుగాని మానుడుల్
అరయగ లేకపోయితివి అంతిమకాలము వచ్చెనేప్రభూ!

ఉ. ఓయి నిజామి కాచుకొను మోపికపట్టితి మింతకాలమున్
భాయి కి భాయి యంచు పలుమారు హితోక్తుల బోధజేసినన్
న్యాయమునున్ గ్రహించకను ఆహవరంగమునందు చూపుచా
ప్యాయముగా యెదుర్కొనగ భారతవీరులు లొంగువారటే

ఉ. చెప్పెను వల్లభాయి మరి చెప్పెను జవ్హారు పండితుండునున్
చెప్పెను మౌంటుబాటను యిసీయనిరోసిరి యెల్లవారునున్
చెప్పినమాట నీమదికి చేదయిపోయెనుగాని వింటివా?
చెప్పుడుమాటలే చెవికిజేరిచి చేటును తెచ్చుకొంటివో

ఉ. భారతవీరు ధైర్యమును పౌరుషమున్ స్థిరచిత్తవృత్తులున్
ఆరయ మీతురుష్కుల కనాదిగ స్పష్టమునౌచువచ్చె, మీ
కూరతనంబు మేమెపుడు గొప్పగ చూడకయుంటచేత మా
భారతభూమి మీరలిటు మన్ననబొందిరిగాని లేనిచో.

ఉ. మీరిటుచేయనేర్తురెటు? మేము సహించితి మెంతకాలమో
వేరొకరైన యీసరికె మీదగు రాజ్యము మట్టుబెట్టి నీ
పేరును యూరుమాపి నిను పెక్కువిధంబుల కాలరాయరే
భారతభూమి మెత్తనిది బాగుగ యొత్తుదమంచు నెంచితో.

చ. మధురముతైన వాక్యములు మంచిగ నీ చెవికెక్కవయ్యెగా
బధిరుడవయ్యు రాజ్యమును పౌరుల పాదానరించినావు, నీ
రుధిరము చూతురింక నిను రోయుదురంచును నేటికైన యా
కుధరమునుంచి దొర్లితివికృద్ధుడకొంపను తీసికొంటివో.

ఉ. మాసరదారుబోధలను మాదు ప్రధాని వచించు పల్కులన్
వీసమునైన నీ చెవినిబెట్టకపోతివి దుష్టబుద్ధివై
మోసరి రజ్వీగాని మరి మూఢుడు లాయిఖు అలిగాని నీ
కీ సమయంబునందునను యేమి సహాయము చేయగల్గిరో.

మ. శరవేగంబున వచ్చుచున్న వవె మాసైన్యంబు లోనైజమా
చెరలో చిక్కెదవో పరారివయెదో సిద్ధంబుగామందు మా
కరటోయిన్ ముకుళించెదో విలిచెదో ఖడ్గప్రిసారంబుకున్
తెరువేదో మనమందు సుస్థిరమునౌ దిట్టంబు ధట్టింపుమా.

ఉ. ముట్టడియయ్యె నింక కనుమోయి నిజాముదె మూడువైపులన్
అట్టిటుచూడబోకు సరిహద్దులు దాటెను మాదు సైన్యముల్
ఎట్టుల తప్పుకొందువొకొ హెచ్చరికన్ మరిచెప్పికొందువో
కట్టలు పొర్లినట్లుగను కాల్నడకన్ చనుదెంచె సేనలున్.

ఉ. చొచ్చుకపోవుచున్న వవె చోరరజాకరరాక్షసావళిన్
పచ్చడిపచ్చడౌనటు శెబాషనిదంచిరి భారతీయులున్
కుచ్చితులైన దుండగుల క్రూరపుదండనపాలుజేసినన్
చచ్చెడి శిక్షవైచినను జాలపడన్ తగునయ్య హైందవుల్.

ఉ. తల్లికి బిడ్డకున్ పతికి దారకు బంధము బాపినావుగా
బల్లిదమంచు నెంచకను పావనులౌ కులకాంత లెందరో
ఘొల్లుమటంచు నేడ్వగను క్రూరతనంబుగ రాక్షసుండవై
అల్లరిపాలుజేసితివి ఆర్తులునై శపియించువారునై.

ఉ. శాపములూరకే జనునె శాంతము సత్వము కల్గువారినిన్
ఆపగశక్యమౌనె పరమాత్ముడు దుష్టుల శిక్షజేయడే?
తాపసులన్ వధించిన యధార్మికు రావణు నంతమొందగా
శ్రీపతిరామచంద్రుడయి చిత్రముగా వధజేయడే భువిన్.

ఉ. మాకును పాకిస్థానమున పల్కుబడిన్ గలదంచు కొంత, మా
పైకి సహాయులై బ్రిటిషువర్గమునుండె నటంచు కొంత, ఆ
పైకిని భద్రతాసమితి భద్రము జేయునటంచుకొంత యీ
సాకులవన్ని జూచుకొని జారితివేమి నిజాము రాజ్యమా.

ఉ. అందినజుట్టుపట్టితివి అందకపోయిన కాళ్లపట్టి నా
వెందులకోయి పౌరుషము వీరతనంబును గోలుపోయి నీ
చందము తేటతెల్లమయె చావని నంతనె యింత భీతియా?
మందుడవైతి వెందులకొ మాదు స్వతంత్రము నోర్వలేకనో.

ఉ. రక్కసుడైన రజ్వి కిక రక్షకులెవ్వరు నీవు దక్క, మా
అక్కసుదీరపట్టితిమి ఆహవమున్ ముగియించినాము యే
దిక్కునులేదు మీ కికను ధీరుడు లాయిఖుఅలి యేగదా
అక్కట చిక్కినారు గద ఆర్తులనై మొరబెట్టువారునై.

ఉ. నేర్పున నా రజాకారుల నింపుగ నిల్పి నిజామురాజ్యమున్
తీర్పులు దిద్ది ఖడ్గమున త్రెంచెద హింధుల శీర్షరక్తమున్
తూర్పుసముద్రమందు కరదోయిని క్షాళనమున్ బొనర్చెదన్
మార్పులులేవు మాహృదయమందునటంచుప్రగల్భముల్ వడిన్.

ఉ. దర్పములాడినావు గద ధైర్యము గొల్పి నిజామురాజుకున్
అర్పణజేసెదన్ శిరమునంచు పదేపది వాగినాడవే
సర్పమువోలె తోకపయి చక్కగనాడిన నీదు శీర్షమున్
అర్పణజేసి హిందువుల నార్తిని వేడెదవేల రజ్వీగా.

ఉ. "కత్తికి కత్తి చూపెదను కాలనురాచెద కళ్లు పీకెదన్
మొత్తెద హిందులన్ దివికి మోక్షమునందగ పంపెదన్ రహీన్"
చెత్తగవాగినాడవెదో చేర్చితివేమి కరద్వయంబునున్
హత్తెరియన్న హిందులకు అట్టై జొహారులవేమి రజ్వీగా.

ఉ. కట్టెద యెర్రికోటపయి కాంచుడు జండనటంచు పల్కినా
వెట్టిది? యేది? యెక్కడను యెందులకున్ కనిపించదోయి నీ
భట్టుపొగడ్తమాటలు శెబాషని నమ్మె నిజాము కర్మమున్
తట్టుకొనంగ లేక కట తందరబిందరలాడె సంధికిన్.

ఉ. చక్కనిరాజ్యవైభవము చాలినయంత ధనంబురాసులున్
చిక్కనిపాలమీగడల జిడ్డును గట్టిన పెద్దగడ్డనున్
టక్కరి రజ్వీ ప్రజ్ఞయును టాలనుటోలియు లాయిఖాలియున్
తుక్కునుతుక్కుచే సిరిగదోయి నిజామ యధార్థమయ్యెగా.

కాటనుతో విమానమున కర్మము తప్పదటంచు పోదువే
పోటరిపై నిలంబడుచు పోరునుసల్పగలేక సైజమా
ధాటికి నిల్వలేనటుల ధర్మము తప్పిచరించు టెందుకో
ఏటముబాంబులేమయిన యేర్పడ చేసికొనంగ లేవాకో.

ఉత్తర దిక్కునందునను ఉమ్మడిగా చనుదెంచె సేనలున్
తత్తరపాటు నొందకుమ ధైర్యమునొందుమ దారిచూపుమా
ఎత్తుడు క్రొత్తదేదొ యొకయెత్తును యోచనజేసి చూడుమా
మత్తుపదార్థ మేదయిన మందుగ వాడిన తెల్వివచ్చుగా.

పడమరనుంచి షోలపురి ప్రాంతముదాటిరి భారతీయులున్
తడబడి పారిపోకను యధార్థపుయుద్ధము చేయనెంచుడీ
గడుసరి రజ్వి చెప్పిన మహాముల సైన్యము నిల్చిచూడుడీ
కడవరకున్ మనంబులను క్రిమ్మరజేయ కెదిర్చిపోరుడీ.

విజయము చేయవచ్చెనవె వీరత భారతసేన లీదెస
విజయవవాడనుంచి కడువిద్యుదు వేగముతో సరాసరిన్
అజయముకల్గునంచు ఉపహారముచేయక నిల్వతొక్కి మీ
విజయము కల్గునంతకును వీసము తగ్గకనిల్చి పోరుడీ.

ఉ. దక్షిణమందునుంచి యవె దాపెను కర్నులు, హోసుపేటయు,
రక్షణ జేసికొంటకును రావదియేమొకొ మీదు సైన్యముల్
శిక్షణ జేసికొంటకును శీఘ్రముగా తరిఫీదు నొటకున్
దక్షతలేదు కావలయు దానవచర్యలె మీకు నైజమా.

మ. జండాగట్టిరి యెర్రబాలెమునదే జై జై ధ్వనుల్ రేగగా
దుండాకోరుల గీటడంచి రదియే, దూరానవే గాంచుడీ
బండాభాయిలు ఆ రజాకరులపై బండారమయ్యెన్ గదా
తుండాతుండెము చేయుచుండి రదిగో దుర్మార్గులన్ ధూర్తులన్

ఉ. ఘోరుమటంచు సైన్యములు బొమ్మకలు న్నవలీలపట్టెగా
చోరులునౌ రజాకరులు సొక్కుచు డీల్పడి సోలినార లే
నోరునులేని బాలలను నొక్కిన మీకరబాహువల్లరిన్
ఢీరతవేయ సంకెలలు తెచ్చుచునుండిరి పారిపోకుడో.

ఉ. నైజము పారిపోవుటయు నైజము బాలల గొంతుకోయుటల్
నైజము దర్పమాడుటయు నైజము కాంతల హింసచేయుటల్
నైజము రాక్షసత్వమది నైజము దోపిడి చేయుటల్ సదా
నైజము కాళ్లపట్టుటయు నైజము తప్పుక వెక్కిరించుటల్.

శా. వాయువ్యంబున వాలుచున్నవవిగో బ్రహ్మాండమౌ సైన్యముల్
సాయంబెవ్వరి కోరినావాగద నీ సంరక్షకై నైజమా
మాయోపాయము బోధజేయు రజివీ మంత్రంబులేమైన నీ
శ్రేయంబిచ్చెడి యోగమున్నసరియే చెల్లింపుమా ప్రాణముల్.



చ. అరయుడు ఓ నిజాము ప్రజలార యథార్థమునున్ గ్రహింపుడీ
స్థిరముగ శాంతిభద్రతలు చేకురజేయు ప్రయత్నముల్ బహూన్
నెరపిన యీ నిజామకట నేర్పగుబుద్ధిని జూపడాయెగా
అరసెనుగాని దుర్బలమటంచు ప్రభుత్వము ధిక్కరించెగా.

ఉ. ధిక్కరణంబొనర్చి రణధీరత జూపగ కాల్బలంబునున్
తుక్కుతుపాకి కత్తులును దుష్కరముష్కరులౌ రజాకరుల్
నెక్కొను సాచుముందెనని నిర్వహణంబును జేయజూచెగా
దక్కనటంచు నృత్యములు తాండవము న్నొనరించుచుండెగా.

శా. రాజాజీ తువిచేఖ నందుకొనియున్ లక్ష్యంబునున్ జేయవో
నైజామా ప్రజనిట్లు హింసలిడగా నాజీయె సిద్ధాంతమా
బాజారెక్కెడి అల్పబుద్ధివగు నిన్ బాటింపగా వచ్చునే
తాజాగా మము వేదవచ్చినను మా ధర్మంబు దండించుటే.

ఉ. ధర్మమునైన పద్ధతికి దారిని జూపితి మెంతకాలమో
నిర్మలబుద్ధి నీయెడల నింతయునున్ గనిపింపదాయెగా
దుర్మదమెక్కి తొయ్యలుల తోరపుశీలము పాడుజేయు నీ
కర్మము తప్పదేమొగద ఖడ్గతళత్తళ ఛాలనంబునన్.

ఉ. స్థాపన జేయనెంచితిమి శాంతము సత్యమహింస ధర్మముల్
ఆపగలారు లేరనుచు ఆత్మనెరుంగుడు సుస్థిరమ్ముగా
ఏపగు ఆయుధంబులును యీటెలు కత్తి తుపాకిరవ్వలే
మాపును మీకు బుద్ధులను మాపగలేవిక మంచిమాటలున్.

మ. అని రాజేంద్రుడు హెచ్చరించెనిక మీయారాటముల్ మానుడీ
అనికిన్ జొచ్చిరి భారతీయు లరుగో ఆదిక్కు యీదిక్కులం
చనుకోకుండగ ముట్టడించి రదియే సంహారమౌచుండెగా
చనుచున్నారు సికిందరాబాదు కదియే సంరంభులై సత్వరన్.

ఉ. బీదరునందు ఓరుగలు వీటినియున్న విమాన ఆశ్రయం
బూదరపెట్టి సర్వమును బుగ్గినిగ్గదా మొనరింపకుండ సం
పాదితులైరి భీరులయి పారుచూండిరి ఆ రజాకరుల్
యేదిశ చూచినన్ మనకు యేర్పడుచుండె జయంబుగాంచుడీ.

గెల్చినయట్టి తావులను జేరి పతాకప్రతిష్ఠ చేయుచున్
కొల్చుచునుండి రెల్లరును కూరిమి భక్తిని శ్రద్ధజూపుచున్
నిల్చానకుండ పారిరదె నిర్జనదేశముచేసి పోయిరే
తల్చుకొనంగ దుఃఖము విదారితమై హృదయంబు వ్రీలెడున్.

ఖమ్మముమెట్టువద్ద నవె కాల్పులమున్ మరలున్ ఫిరంగులున్
నమ్మకమై జయించుటకు నాలుగుదిక్కుల చోరులన్ వలెన్
గిమ్మనకుండ దాగిరట గీల్కొనిరేగ నవాబుసేనలున్
ఇమ్ముగ మా విమానములు యేసిన బాంబుల ధాటికోర్వలే.

కెమ్మయినో నిజాముదళ మెక్కడి కక్కడ భిన్న భిన్నమై
సొమ్మసిలెన్ జొహారులవె ఘోరుగ సల్పుచు లొంగినారలే
కమ్మగ గంజిత్రాగు మనకర్మము యిట్టులగాలె నేమిరా
రమ్మని చేరుచుండి రదె లక్షలకొద్దిని యూనియన్నులో.

కొబ్బలు పట్టణంబు నదె కొల్లగగొట్టి జయించినారుగా
నిబ్బరమైన సేనగని నీలిగినారు నిజామువారదే
దెబ్బకు దెబ్బ తీయగనె తేరికొనంగను దారిలేక తా
గొబ్బునచేతులెత్తుచును ఘొల్లునయేడ్చిరి ఆ రజాకరుల్.

ఉ. ఆ నలుదుర్గబట్టిరట ఆర్భటిచేసిన ఆరజాకరుల్
దీనులునైరి సాగిలిరి తీర్పునుదిద్దిరి భారతీయులున్
వేనకువేలు భీరులయి వీరతనంబునుపీడి చేరుచున్
బానిసలైరిలొంగిరహొపాదముబట్టి క్షమింపవేడుచున్.

చ. కనివినియుంటిమే యెపుడుగాని ప్రపంచ చరిత్రలోన తా
చెనటియెగాక యుండినచొ, చెచ్చెరబట్టునె రాయబారియా
మునిషిని, పోవుకాలమిదె ముంచుకవచ్చెను ఓనవాబ నిన్
కనికరమింత చూపుటయె కారణమయ్యెను మాదులోపమే

ఉ. గద్దియ దింపివేయవలె గౌరవముంచగ వీలుతేదుగా
పద్దులువ్రాయుటో బడికిపంతులుగా నియమించుటో వడిన్
రద్దునుజేసి నైజమును లక్షణవంతునిగా యొనర్పుటో
సుద్దులు వేయునేల? తగు సూత్రముతోడను బందిజేయుడీ.

ఉ. పావనమైన మీహృదయ భాస్కరునిన్ గమనింపకన్ సదా
చేవగలట్టి వారమని చీకటిలోబడి ప్రమ్గుచున్నయా
భూవరు నా నిజాము నిదె బుగ్గి యొనర్పగ జేయుడంచు నా
పావన కాశ్మిరాధిపతి పంపప్రమాణము జేసెసైన్యమున్.

ఓరీ రజ్వీ సవాలుజేసితివి నీయుత్తేజ మేమాయెరా
ఝారీబుద్ధి యదెట్లు వచ్చెనుర? యోపాపాత్ముడా క్రూరుడా
చోరీవై వ్యభిచారివై గరపు నీ సూత్రంబులేమాయె మా
భేరీ మ్రోగుచునున్నదో వినుముగా వీరాగ్రణుల్ రండురా.

ఎగురగవేసెదన్ ముదమునివ్వగ మాదుపతాక మంచునన్
ఎగిరిన రజ్వీగా ఎగురవేయవదేమిర మీపతాకమున్
తగునని వాగివావుగద తావునుజూపితి మెర్రకోటలో
పొగరది తగ్గెనాయెమిర? మూర్ఖుడ మూతిని మీసమేదిరా?

ఔరంగ్బాదదె లొంగిపోయె మము ఆహ్వానించె బేషర్తుతో
ఔరా దౌలతబాదుగూడ ముగిసెన్ ఆర్భాటమేలేక యో
వీరాగ్రేసరుడైన రజ్వీచెనటీ బీరంబులేమాయెరా
దూరాలోచనలేక వాగితివిరా దుర్మార్గుడా ధూర్తుడా.

ఖమ్మము సూర్యపేటయును ఘంటలమీదను పట్టినారదే
దుమ్ముగదుమ్ము జేసియును దోర్బలశాలురు భారతీయులున్
ఝమ్మను శంఖరావముల బాకలునూదుచు ఆ యొరంగలున్
గిమ్మనకుండ పట్టిరట కేకిసగొట్టి సవాలుజేయుచున్.

మ. జహీరాబాదును చేరినారలదిగో సన్నాహ సంరంభులై
మహిలో భారతవీరులన్నహదలే మాన్యత్వమున్ బొందరే
అహినిన్ పట్టినరీతి సైజమును వారంతంతలో పట్టిరే
సహియింపంగనువచ్చునే సదయతన్ ఛండాలుడౌ రజ్వినిన్.

ఉ. కాశిమురజ్వి ప్రభ్రుతులు కాల్నడకన్ మరిపారిపోవగా
ఆశయులేక పోయెగద అంతకుమించి విమానమెక్కియున్
రోసమువీడి యేగుదురె? రోయదెలోకము దూయబట్టదే
ఆశయులేదు యేదిశను అన్నిట దిట్టము జేసినారుగా.

ఉ. రక్షణమోయి జార్జిప్రభు లక్షలసైన్యము భారతీయులున్
శిక్షణలేని సైన్యమును చిందరవందర జేయుచుండ్రహో
రక్షణమోయి అట్టిపరిక్షణ మివ్వనిచో నిజామునున్
భక్షణజేయవచ్చిరదె భారతవీరులు తక్షణంబుగన్.

ఉ. ఊరక చూచుచుండినచొ ఓటమితప్పదు మీకు న్యాయమా
భారము మీదెయుంచు కడుభారమునౌ కదనమ్ము దూకితిన్
జేరుచునుండె ఇండియనుసేనలవే విఫలంబు నొందితిన్
కోరితి మీదు అండను చకోరము చీకటికోరినట్లుగా.